## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016492

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.

# గోపాలశతకము.




సత్యవోలు సుబ్బారావు



పీఠికాపురము.

1938

శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః.

# గోపాలశతకము



శ్రీరాజరాజగోపా
లా! రమణీహృదయలోల! లక్ష్మీరమణా!
కారుణ్యపూర్ణహృదయా!
నారాయణరూప! భక్తనత! గోపాలా! 1

క. నీను( గాంచినంతమాత్రము
నను దయనేలుచు( గుచేలునకు( గడు సిరులన్
దనివిగ నిచ్చిన ఘనుడవు
మనమున నను మఱచిపోకుమా గోపాలా! 2

క. కొలిచిన నిన్నే కొలువ(గ
వలయును బరదేవతలను బ్రార్థించంగా
వలసినపని యేమున్నది?
తెలచెద నా మదిని సంతతము గోపాలా! 3

క. కందములనేక ములొ
సందములో( గూర్చి నే నిపుడు(డ నగుచున్
వందనశతకంబులతో
సందిచ్చెద దాని( గొనవయా గోపాలా! 4

క. కరి( గాచితి వని నీపద
సరసీరుహములను నమ్మి సద్భక్తిని నే

మొఱ లిడినఁ గావ వేలర
వరపీఠపురీనివాస ! వరగోపాలా ! 5

క. నతభక్త లోకరక్షక !
కృతనానాలోకలోక కృతలక్షణ నీ
సతతము మది వినుతించెద
హితమతి ! నన్నేలు శ్రీహరీ ! గోపాలా ! 6

క. లోకమున నీవు చేయని
దేకడ నొక్కండు వస్తు వేదియుఁ గలదే ?
నీ కదియే యిడ నాయమె ?
నా కృతపాపముల నిడుదునా గోపాలా ! 7

క. వందనము నందనందన !
సుందరవదనారవింద ! శుభగుణబృందా !
వందిత నిర్మల సనకస
నందనహృత్పద్మభృంగ ! నవగోపాలా ! 8

క. అద నని మది నెఱిఁగియు స
మ్మదమున ననుఁ బ్రోవఁగాఁగ మానితి వేలా ?
యిది నీకుఁ దగునో తగదో
మది యోజనసేయవలెఁ జుమా గోపాలా ! 9

క. ననుఁ గావ కూరకుండినఁ
బనిఁగొని నీమీఁద సత్యభామామణితో
వినిపించెద. నీ నేరము
లను; దెలియుము భక్తవత్సలా ! గోపాలా ! 10

క. కాళిందిమడుఁగునకుఁ జని
కాళాహిశిరంబుమీఁద గంతుల నిడఁగాఁ
జాలితివా ? నను దయతోఁ
బాలింపఁగ నీవు చాలవా ? గోపాలా ! 11

క. ఎందటినో కాచినా వని
యెందఱో చెప్పంగ వింటి నిది నిజమేనా ?
సందియము నొందె నా మది
వందితపాదారవింద ! వరగోపాలా ! 12

క. చక్కఁగఁ బరిశీలించిన
నిక్కముగా నిన్నుఁబోలు సేత లిఁ కేరీ ?
మిక్కిలి నిను నమ్మితిరా
గ్రక్కున నన్నేల వేలరా ? గోపాలా ! 13

క. మక్కువ గలదేవుఁడ వని
నిక్కముగా భక్తజనుల నెఱిఁ గృపతోడన్
జక్కఁగఁ బాలించెద వని
దిక్కు వని నిన్ను నమ్మితిని గోపాలా ! 14

క. విడువనిభక్తిని నే నీ
యడుగులకున్ మ్రొక్కి కావు మని వేఁడుటయుం
దడయక ననుఁ గాచి వరం
బిడుటయె నీపని సదా; హరీ ! గోపాలా ! 15

క. తలమీఁద నెమిలిపురి చే
తులలో వేణువును బూని తూఁగాడుచుఁ గ

న్నులకుం గనఁబడునంతనె
కలుగునె యపకీర్తి మెండుగా గోపాలా ! 16

క. జగముల బలుసంకటములు
తగు ప్రేమం బూని కావఁ దగు నీ పదముల్
సుగతిం గోరి భజించెద
నగధర ! శ్రీనందనందనా ! గోపాలా ! 17

క! పను లేవియుఁ జెప్పను నిదు
మనియును నిన్నడుగ నాదు నక్షుల కెదుటం
గనఁబడి నావందనములు
గొను మందును వాని నందుకో గోపాలా ! 18

క. లలితపు సొంపులతోడను
విలసిల్లెడి నీవు నాకు వేణువుఁ గొని స
ల్లలితపుగానము సేయుచుఁ
దలఁచినఁ గానఁబడఁగూడదా గోపాలా ! 19

క. అనునయపదములచే నినుఁ
బనివడి ప్రార్థింప రావు పలుక వదేమీ
మునుపటి నా పాపంబులు
నిను రాకుండంగఁ జేసెనే ? గోపాలా ! 20

క. వేఁడుదు హేకృష్ణా ! కాఁ
పాడుము నను నీవు దక్క కాఁపాడెడువాఁ
డేఁడును లేఁ డని నే మొఱ
లాఁడిన నన్నేల వేలరా? గోపాలా ! 21

క. దేవా ! శ్రీకృష్ణా ! దయఁ
గావర యని వేఁడికొన్నఁ గరుణను నన్నున్
సేవాప్రియ ! కావవు; నిను
సేవింపకమానఁజుమ్మ శ్రీగోపాలా ! 22

క. కావుము కాచుటమానుము
సేవించుట నాదివంతు చిరతరభక్తన్
భావించి నన్నుఁ గాచుట
నీవంతని చెప్పవలయునే గోపాలా ! 23

క. వారినిధి బాలికాప్రియ !
సారసపత్రాయతాక్ష ! సామజవరదా !
కోరుదు నినుఁ జూడఁగ మది
రారా నాకోర్కెదీర్పరా గోపాలా ! 24

క. తలఁచెద ననుదినమును నినుఁ
బలుకుము దయగల్గియొక్కపలు కది చాలున్
వల దందు నితరములు నా
వలనం గృపఁజూపరాదె ? వరగోపాలా ! 25

క. నీకుఁగల సర్వభాగ్యము
నా కిమ్మనువాఁడఁగాను నాకన్నులకున్
కేకిసలు పెట్టి పిలిచిన
రా కుంటి వదేమొ తెల్పరా గోపాలా ! 26

క. సంచితములఁ బాపముల స
డంచెద వని నిన్ను నమ్మి డబ్బుఅ విడిసే

వించిన దయఁ గావవు నన్
వంచించుట పాడిగాదు వరగోపాలా ! 27

క. సంతతముండెడినిను నా
స్వాంతంబునఁ గొల్తు నాకు స్వాధీనుఁడవై
శాంతినొసంగుము చాలును
జింతల నెడఁబాపి వేగ శ్రీగోపాలా ! 28

క. అతులితమగుకరుణను ది
క్పతులను దేవతల మునుల బ్రహ్మాండములన్
గతి నీవై పాలించెదు
క్షితినాయక ! నీకు నతులు శ్రీగోపాలా ! 29

క. నీనిజమగురూపము నా
కేనాఁటికి నైనఁ జూపు దేమో యని నే
నానారీతుల వేఁడినఁ
బోనీ యని చూపవైతివో, గోపాలా ! 30

క. శిర మూన మ్రొక్కుదును నీ
చరణంబులు చూపు మదియె చాలును నాకున్
సిరిగలవాఁడ వటంచును
గరులుం దేజీలుఁ గోరఁగా గోపాలా ! 31

క. తలఁచినమాత్రన భక్తుల
తలఁపుల నీడేర్చి మిగుల దయతో వారిన్
బలుమఱుఁ గాచితి వని విని
గొలుతును ననుఁ గరుణ నేలుకో గోపాలా ! 32

క. శ్రీరాజితగుణజాలా !
సారసపత్త్రాయతాక్ష ! సకలాధ్యక్షా !
కారుణ్యనిలయ ! కృష్ణా !
శ్రీరమణీహృదయలోల ! శ్రీగోపాలా ! 33

క. నీ నామాక్షరముల నే
మానవుఁడైన మది నొక్కమాఱు వచింపన్
నానావిధములపాపము
లైనను నిర్మూలమగుఁ జుమా గోపాలా ! 34

క. అలనాఁ డజామిళుం డను
గులపాంసుఁడు కూర్మిసుతునిఁ గోర్కెన్ బిలువన్
దలఁచెను నన్నే యని వ
ర్ధిలు సౌఖ్యము లతని కొసఁగితివి గోపాలా ! 35

క. ఎక్కడి పుత్త్రులు బంధుగు
లెక్కడి చుట్టాలు భార్య యెక్కడి తనయుల్
ఎక్కడి సిరిసంపత్తులు
నిక్కములే ? వీని నమ్మ నే గోపాలా ! 36

క. ఉదరమున విశ్వ మంతయుఁ
గుదురుగ నిలుపుకొని దానిఁ గుతుకముతోడన్
బదిలంబుగఁ బాలించెడి
సదయాత్మా ! పరమపూరుషా ! గోపాలా ! 37

క. జగముల వెలుపల లోపలఁ
దగ నీవెయుండి నాదు తలఁపున నిలువం

దగు యత్న మేల సేయవు ?
తగునా యిది భక్తముక్తిదా ! గోపాలా ! 38

క. స్థిరుఁడవు కరుణాకరుఁడవు
గురుఁడవు ముల్లోకపాలకుఁడవును కృష్ణా !
పరుఁడవు సంపత్కరుఁడవు
స్థిరభక్తిని నిన్నుఁ గొల్తు శ్రీగోపాలా ! 39

క. తలఁచుట తడవుగ సద్భ
క్తులబాధలు మాన్పి వారికోర్కుల నెల్లన్
లలిఁ దీర్చువాఁడవైనను
గొలిచిన ననుఁ గావ వేలకో ! గోపాలా ! 40

క. మిక్కిలి ముద్దులుగులికెడు
చక్కని నీమోము వేగ సాదరమున నా
కొక్కపరి చూపి నను నా
యక్కఱఁ దీర్చుకొననీయవా ? గోపాలా ! 41

క. నీ కేలూఁతగ దొరకెను
నా కిఁకఁ దొలఁగినవిసుమ్ము నానాబాధల్
నీ కే దాసుండను ననుఁ
జేకొని కాపాడవలయు శ్రీగోపాలా ! 42

క. జగదుద్ధారణకొఱకై
తగ దశరూపములు దాల్చి ధరణిన్ గరుణన్
బగతుర నడంచి కాఁచితి
జగతీధవ ! పరమపూరుషా ! గోపాలా ! 43

క. నామీఁదఁ గరుణ లేదా
యేమీ నే వేఁడికొనిన నేమోకానీ
నీమోము దాఁచుకొనెదవు
మామా ! యిది నీకు నైజమా ? గోపాలా ! 44

క. నేనును నావ్రజపురిలో
జానుగ నొకగొల్లభామసాకిరి నైనన్
మానక నీ మృదురూపము
నేనును గనుఁగొనక యుందునే ? గోపాలా ! 45

క. ఎంచఁగ నజామిళుని ర
క్షించినదయలోనఁ గొంత శీఘ్రముగాఁ జూ
పించిన నీ పాదములను
నంచిత మగుభక్తిఁ గొలువనా ? గోపాలా ! 46

క. నినుఁ జులకనగా గోవ
ర్ధనపర్వత మెత్తి పశుల వ్రజపురిజనులన్
బనిఁగొని రక్షించితి వని
విని నిను వేఁడితిని గావవే గోపాలా ! 47

క. నెమిలిపురి వెదురుకఱ్ఱయుఁ
దమపూర్వపుజన్మమునఁ బ్రశస్త తపం బే
సమయమున నెటులఁ జేసెనో
తమభవములు పూతములుగదా ? గోపాలా ! 48

క. తలఁపఁగ నీసరిత్రాతలు
గలరే ? లోకత్రయంబు గాలించిన నో

జలజాతలోచనా ! నా
వలనం గృపఁ జూప నెంచవా ? గోపాలా ! 49

క. ఆపదఁ బడలేకను నీ
ప్రాపును మదిఁ గోరి వేఁడ ద్రౌపది కభయం
బేపార నొసఁగి ప్రోచితి
నాపై నదయత యిది తగునా ? గోపాలా ! 50

క. అలిగితివో మఱచితివో
తలఁచితివో నన్నుపాత్రతముగా నీకే
యలవాటు లేదొ భక్తుల
వలనం దయ సూప నోయి వరగోపాలా ! 51

క. వందనము నందనందన
వందన మానందరూప వాసవవినుతా
వందనము లోకపాలక
వందితపాదారవింద వరగోపాలా ! 52

క. నేరము లెంచకు నేనే
నేరిమియును లేనివాఁడ నీచాత్మ్యుండన్
గోరి యొనరించెద నమ
స్కారము లవి గొనుము వేడ్కగా గోపాలా ! 53

క. జలజభవాదులు నిన్నున్
దెలియఁగ మదిఁగోరి యధికదీక్ష భజింపన్
దెలియఁగ నేర్తునె నిను నా
కలవియె ? దయఁజూపి కావరా గోపాలా ! 54

క. వదలక సతతము నీమ్మృదు
పదములు నామదిని గొల్వవలెనను బుద్ధిన్
సదయుఁడవై దయసేయుమ
యది చాలును దాని నొసఁగుమా గోపాలా ! 55

క. నీ పాదములే గతి సుమి
నా పాపములెల్ల నాశనముచేసి వడిఁ
గాపాడవలెను నీవే
ప్రాపిక యెద్దియును లేదురా గోపాలా ! 56

క. అన్నా ! యాపన్నుఁడ; నే
నెన్నివిధంబులను వేఁడి యిటు గొల్చిన నన్
మన్నించి కావవైతివి
న న్నెవ్వరు గాతు రింక నయగోపాలా ! 57

క. అనుదినము నిన్నుఁ దలఁచితి
నని యైనను గరుణఁ జూప కదయుఁడ వగుచున్
నను నొంప నీకుఁ బాడియె
జనసంస్తవ్యగరుడధ్వజా ! గోపాలా ! 58

క. ననుఁ గాఁచుట కిది తరుణం
బని నేఁ బలుమాఱు నిన్ను నర్థింపఁగ నా
వినవు దయ చూప వింక నే
మని యెంతని వేఁడికొందురా గోపాలా ! 59

క. అలుక వహించితివేమో
కొలిచెద సుమ సత్య నే నకుంఠితభక్తిన్

కలఁగుచు నప్పుడెసను నీ
యలక న్విడనాడకుందువా ? గోపాలా ! 60

క. నిరతము నీ చరణములను
స్మరియించితి నన్నుఁగావ సమయం బని నే
మొర లిడితి నింతకంటెను
నరణం బీయంగనేర్తునా గోపాలా ! 61

క. జగదాధారుఁడ వనియును
నిగమములకు మొట్టమొదటి నిలయుఁడ వనియున్
దగ భక్తులఁ బ్రోచుదు వని
దిగధీశుఁడ వనుచు నమ్మితిని గోపాలా ! 62

క. దారుణపాతకుఁ డని ననుఁ
గారుణ్యముఁ జూపమాని కష్టంబులనే
యోరుచుకొ మ్మని యీగతి
తీరనిరోగములు తెచ్చితివె గోపాలా ! 63

క. నీపేరు వినినయంతనె
కోపంబున మండిపడిన క్రూరాత్ములనే
కాపాడినాఁడవు గదా
ప్రాపై నను బ్రోవవేలరా గోపాలా ! 64

క. లోపము లెన్నక గాచుట
నీపని యని తెలిసి భక్తి నే సేవింపం
గాపాడ కూరకుంటివి
నాపాపము లడ్డగించెనా ? గోపాలా ! 65

క. జడముంబలె, నేనును నీ
యడుగులకు న్మడుగులొత్త కతిమాంద్యముగాఁ
గడపితి బహువత్సరములు
చెడిపోతిని గావుమయ్య శ్రీగోపాలా ! 66

క. గోవర్ధనగిరియంతటి
లావుం గల నగము బంతిలాగున వడిగా
లేవఁగ నెత్తిన నీకున్
భావింపఁగ భార మైతినా గోపాలా ! 67

క. సాధుల నకారణముగా
వేధించిన రాక్షసాధివీరుల ననిలో
సాధించి జనుల కుండెడి
బాధలఁ బాపితివి కాదె ? వరగోపాలా ! 68

క. నిక్కముగ నీకు మ్రొక్కితిఁ
జక్కఁగ న న్నేలుకొనవు సాధ్యము కాదో
పెక్కురఁ బ్రోచితి వనియెద
రక్కజ మామాట సత్యమా ? గోపాలా ! 69

క. నీవలనఁ బాండుపుత్రులు
భావింపఁగ బావుకొనిన భాగ్యం బెల్లన్
కేవలముఁ బాడురాజ్యము
నీ వంతకు నెక్కు డిడితివే ? గోపాలా ! 70

క. క్రూరుఁడు గర్ధు దుర్మార్గుఁడు
దారుణపాతకుఁడు వీని దరిఁ జేర్చుటయే

మీఱినపాతక మని నను
జేరఁగఁదీయంగ వేమొ శ్రీగోపాలా! 71

క. జలజాసన నుతచరణా!
జలజేక్షణ! భక్తలోక సంరక్షణ! నిన్
గొలిచెద నీ వెప్పుడు నా
తలఁపున నిలువంగఁగూడదా గోపాలా! 72

క. శరణు దురితాపహరణా!
శరణు రమారమణలోక జనకా! నాకున్
శరణ మొసంగుచు నను స
త్కరుణం బాలింపు కొలిచెదం గోపాలా! 73

క. నిగమములు లక్షసారులు
మిగులఁగ సద్భక్తితోడ మెయికొని సదువం
గఁ గలుగు పుణ్యముకంటెం
దగ నినుఁ దలఁపఁగ లభించదా గోపాలా! 74

క. అపరాధి యీతఁ డనకను
గృపతో మన్నించి నాకు నీప్సితసిద్ధిన్
నెప మెంచక దయసేయవె
విపులం బగుగీర్తిఁ బొందవే గోపాలా! 75

క. దండము సురగణరంజన!
దండము వేదండభీతిదమనా! కృష్ణా!
దండము దుర్జనభంజన!
దండము జగదీశ! సర్వదా గోపాలా! 76

క. జయమగు నీ నామములకు
జయమగు నీ పాదకమల సద్భక్తులకున్
జయమగు నీ రూపములకు
జయమగు నోపరమపూరుషా ! గోపాలా ! 77

క. శ్రీరాధాలోలా ! వ్రజ
నారీహృచ్చోర పద్మనాభా ! కృష్ణా !
కారుణ్యసదన ! పాపవి
దారణ ! యోగీంద్రసౌఖ్యదా ! గోపాలా ! 78

క. రారా కపురము మంగళ
హారతి నీ కిదుదు యదుకులాంబుధిచంద్రా !
దారుణసంకటహరణా !
రారా, కైకొనర దేవరా ! గోపాలా ! 79

క. అంగజసన్నిభ విమల శు
భాంగా ! బ్రహ్మాండభాండభాండోదర ! శ్రీ
రంగా ! గోపీజనహృ
ద్భృంగా ! శ్రీకృష్ణ ! కృష్ణ ! శ్రీగోపాలా ! 80

క. వందనము మోక్షదాయక !
వందన మసమానతేజ ! భాసితచరితా !
వందనము సకలమునిజన
వందిత చరణారవింద ! వరగోపాలా ! 81

క. శ్రీపీఠపురీనిలయా !
శ్రీపా ! లోకాధినాథ ! జీవాధారా !

మీఱినపాతక మని నను
జేరఁగఁదీయంగ వేమొ శ్రీగోపాలా ! 71

క. జలజాసన నుతచరణా !
జలజేక్షణ ! భక్తలోక సంరక్షణ ! నిన్
గొలిచెద నీ వెప్పుడు నా
తలఁపున నిలువంగఁగూడదా గోపాలా ! 72

క. శరణు దురితాపహరణా !
శరణు రమారమణలోక జనకా ! నాకున్
శరణ మొసంగుచు నను స
త్కారుణం బాలింపు కొలిచెదం గోపాలా ! 73

క. నిగమములు లక్షసారులు
మిగులఁగ సద్భక్తితోడ మెయికొని నదువం
గఁ గలుగు పుణ్యముకంటెం
దగ నినుఁ దలఁపఁగ లభించదా గోపాలా ! 74

క. అపరాధి యీతఁ డనకను
గృపతో మన్నించి నాకు నీప్సితసిద్ధిన్
నెప మెంచక దయసేయవె
విపులం బగుగీర్తిఁ బొందవే గోపాలా ! 75

క. దండము సురగణరంజన !
దండము వేదండభీతిదమనా ! కృష్ణా !
దండము దుర్జనభంజన !
దండము జగదీశ ! సర్వదా గోపాలా ! 76

క. జయమగు నీ నామములకు
జయమగు నీ పాదకమల సద్భక్తులకున్
జయమగు నీ రూపములకు
జయమగు నోపరమపూరుషా ! గోపాలా ! 77

క. శ్రీరాధాలోలా ! వ్రజ
నారీహృచ్చోర పద్మనాభా ! కృష్ణా !
కారుణ్యసదన ! పాపవి
దారణ ! యోగీంద్రసౌఖ్యదా ! గోపాలా ! 78

క. రారా కపురము మంగళ
హారతి నీ కిడుదు యదుకులాంబుధిచంద్రా !
దారుణసంకటహరణా !
రారా, కైకొనర దేవరా ! గోపాలా ! 79

క. అంగజసన్నిభ విమల శు
భాంగా ! బ్రహ్మాండభాండభాండోదర ! శ్రీ
రంగా ! గోపీజనహృ
ద్భృంగా ! శ్రీకృష్ణ ! కృష్ణ ! శ్రీగోపాలా ! 80

క. వందనము మోక్షదాయక !
వందన మసమానతేజ ! భాసితచరితా !
వందనము సకలమునిజన
వందిత చరణారవింద ! వరగోపాలా ! 81

క. శ్రీపీఠపురినిలయా !
శ్రీపా ! లోకాధినాథ ! జీవాధారా !

యాపద్బాంధవ ! కృష్ణా !
ప్రాపై న న్నేల వేలరా గోపాలా ! 82

క. సంపత్తి నశ్వరము చిం
తింపఁగ నది నీదునామ దివ్యామృతమే
సంపాదించెద న న్నను
కంపం రక్షించు రక్షకా ! గోపాలా ! 83

క. మునుపటి నీ జవసత్వము
లణఁగినవా యేమి యెంత యర్థించిన నా
కనులకుఁ గనఁబడ వది యొక
ఘనకార్యమె తలఁచి చూడఁగా గోపాలా ! 84

క. ధర మీన కూర్మ కిటి కే
సరి వటు భృగురామ రామచంద్రాది మహా
స్థిరరూపము లెత్తుచు నీ
ధర నేలితివయ్య సౌఖ్యదా గోపాలా ! 85

క. నీ నిజరూపము నేనాఁ
డేనియుఁ గనుభాగ్య మబ్బునే తలపంగా ?
నానాఁడే సుదినముకద
శ్రీనారీహృదయలోల ! శ్రీగోపాలా ! 86

క. పలుబాధలు పడఁజాలక
తలఁచితిఁ గొలిచితిని నిన్ను ధ్యానించితి నా
వలనం దయ చూపవు న
న్నలసటఁ బొందింప నాయమా ? గోపాలా ! 87

క. బ్రతికిన కొన్నాళ్ళును నా
గతి నీవే కావు మనుచుఁ గడు దైన్యముగా
బతిమాలుటయే నాపని ?
హితమతివై యేలఁగూడదే ? గోపాలా ! 88

క. ఎన్నాళ్ళు కొలువవలెనో
కొన్నాళ్ళకునైన నిన్నుఁ గుతుకముమీఱన్
గన్నారఁ జూడఁగలనా
సన్నుతగుణ ! పరమపూరుషా ! గోపాలా ! 89

క. దోసా లెన్నక నను నీ
దాసునిగా నేలికొనుము దయఁజూడుము నన్
గూసుగ నెంచక కావుము
శ్రీసఖ ! శ్రీకృష్ణ ! కృష్ణ ! శ్రీగోపాలా ! 90

క. దాసానుదాసుఁడం జుమి
యాసక్తుఁడ నీ పదాంబుజారాధనలన్
నా సర్వదోషములు వే
కూసులుగా నెంచి యేలుకో గోపాలా ! 91

క. చలిగాలిన్ జలినీరిఁ
నిలఁబడి సేవింప నిన్ను నిర్మలమతినై
చలచిత్తుఁడఁ గించిద్జ్ఞుఁడ
నలవడ వవి నన్నుఁ గావవా ? గోపాలా ! 92

క. కొఱగాని కుఱ్ఱవలె నేఁ
గొఱగాములఁ గూసి నీదు కోపంబునకున్

గుటియైతి మందబుద్ధిని
గొఱుతం బడఁజేయు నేమొకో గోపాలా ! 93

క. ధనధాన్యంబులు గోరను
నినుఁ జూడఁగఁ గోరుకొందు నిఖిలాధీశా !
యనుకూలుఁడ వై నిను నా
కనులారఁగఁ జూడనిమ్ము ఘనగోపాలా ! 94

క. గోపాలా ! గోపాలా !
గోపాలా ! యనుచుఁ బిల్వ 'కూ' యనరాదా ?
యోపిక లేదే యన ? నీ
యేపున కేమైన కొఱఁతయే ? గోపాలా ! 95

క. ధరఁ బీఠికాపురంబున
వర మల్యాలకులవీథి వసియించుచు మేల్
వరదుఁడ వని బిరు దొందితి
సిరినాయక ! చిన్నికృష్ణ ! శ్రీగోపాలా ! 96

క. బలిచక్రవర్తి శిరమున
లలి మోపిన పాదతలములను గుతుకముతోఁ
గొలిచెద నీవే నా గతి
యలుగక నన్నేలుకొనవయా గోపాలా ! 97

క. జాలముసేయక నాపై
జాలింబడి శరణ మిచ్చి శాశ్వతసుఖమున్
మే లెంచి నా కొసంగుము
శ్రీలక్ష్మీహృదయలోల ! శ్రీగోపాలా ! 98

క. గోపాలశతక మిది యే
పాపాత్ముం డైనఁగాని భక్తిం జదువన్
గోపాలుఁడు సదయుం డై
యాపాపిని గాచి యొసఁగు హర్షము లెల్లన్ 99

క. వేఁడికొను భక్తవరులను
జూడవు కాపాడఁబోవు చోద్యము దలఁపన్
నోడింపనెంచి వారిని
సోడింతువు నీకు నైజమా ? గోపాలా ! 100

క. నీయెడలఁ గల్గు భక్తి వి
ధేయతలం జూడఁగోరితేని నిలువఁగా
నాయుంత హీనుఁ డోపునె
మాయామయదివ్యరూప ! మాగోపాలా ! 101

క. మునులంతటి ఘనులే నిను
గనఁజాలక వెరవులేక కాలం బెల్లన్
పనివడి వినియోగించిరి
నినుఁ గనుఁగొన నేను దగుదునే ? గోపాలా ! 102

క. వేయేల నిన్నుఁ దలఁచిన
నాయుర్దాయంబు హెచ్చు నంతంబునఁ బ్రా
ధేయపడి విష్ణుదూతలు
కాయముతో నతనిఁగొందు)గా ? గోపాలా ! 103

క. నాకుఁగల భక్తి కొలఁదిని
నీ కర్పణ సేయనెంచి . నే నిద్దానిన్

జేకొని వ్రాసి యొసంగితిఁ
జేకొను మిది కాదు నాక శ్రీగోపాలా ! 104

౦. నీ కరుణచేత నేశ్రమ
లేకయె కడువేగ దీని లిఖియించి తగన్
నీ కర్పిత మొనరించితి
నీకృతిఁ గాపాడవలెఁ జుమీ గోపాలా ! 105

క. తనయుఁడు వల్కినవాక్యము
లను విని జనకుండు వాని లాలించినరీ
తిని నా యీశతకంబును
విని నను బాలనము సేయవే గోపాలా ! 106

క. వేంకటరత్నాఖ్యునకును
వేంకాంబికకును సుతుండ విమలయశుండన్
బొంకముగ సుబ్బారా వను
సంకంబునఁ బిలువఁబడుదురా గోపాలా ! 107

క. పరమేశ్వర ! యీశ్వరవ
త్సరమున ఫాల్గుణబహుళదశమినాఁటికి నేఁ
బరిపూర్తిచేసి యిడితిన్
వర చరణసమర్పణముగ వరగోపాలా ! 108

—• సంపూర్ణము. •—

